# అథ చతుర్దశో%ధ్యాయః

# జలంధరుని జన్మ, వివాహము

వ్యాస ఉవాచ |

సనత్కుమార సర్వజ్ఞ బ్రహ్మపుత్ర నమో%స్తుతే | శ్రుతేయమద్భుతా మే%ద్య కథా శంభోర్మహాత్మనః || 1

క్షిప్తే స్వతేజసి బ్రహ్మన్ భాలనేత్ర సముద్భవే | లవణాంభసి కిం తాతాభవత్తత్ర వదాశు తత్ || 2

వ్యాసుడిట్లు పలికెను -

సనత్కుమారా! సర్వము నెరింగిన వాడా! బ్రహ్మపుత్రా! నీకు నమస్కార మగుగాక! నేనీ నాడు మహాత్ముడగు శంభుని అద్భుతమగు ఈ కథను వింటిని (1). ఓ పూజ్యా! తండ్రీ! లలాటనేత్రమునుండి పుట్టిన తన తేజస్సును శివుడు సముద్రములోనికి విసిరివేసిన పిదప అచట ఏమాయెను? ఆ విషయమును శీఘ్రముగా చెప్పుము (2).

సనత్కుమార ఉవాచ |

శృణు తాత మహాప్రాజ్ఞ శివలీలాం మహాద్భుతమ్ | యచ్ఛ్రుత్వా శ్రద్ధయా భక్తో యోగినాం గతి మాప్నుయాత్ || 3

అథో శివస్య తత్తేజో భాలనేత్ర సముద్భవమ్ | క్షిప్తం చ లవణాంభోధౌ సద్యో బాలత్వమాప హ || 4

తత్ర వై సింధు గంగాయాస్సాగరస్య చ సంగమే | రురోదోచ్చై స్స వై బాలస్సర్వలోక భయం కరః || 5

రుదతస్తస్య శ##బ్దేన ప్రాకంపద్ధరణీ ముహుః | స్వర్గశ్చ సత్యలోకశ్చ తత్స్వనాద్బధిరీకృతః || 6

బాలస్య రోదనేనైవ సర్వే లోకాశ్చ తత్రసుః | సర్వతో లోకాపాలాశ్చ విహ్వలీకృతమానసాః || 7

కిం బహూక్తేన విప్రేంద్ర చచాల సచరాచరమ్ | భువనం నిఖిలం తాత రోదనాత్తచ్ఛిశోర్విభోః || 8

సనత్కుమారుడిట్లు పలికెను -

వత్సా! నీవు గొప్ప బుద్ధిమంతుడవు. మహాద్భుతమగు శివలీలను వినుము. ఏ భక్తుడు దీనిని శ్రద్ధతో వినునో, అతడు యోగులు పొందే గతిని పొందును (3). శివుని ఫాలనేత్రమునుండి పుట్టి సముద్రములోనికి విసిరి వేయబడిన ఆ తేజస్సు అపుడు వెంటనే బాలుని రూపమును పొందెను (4). అచట గంగా సాగరసంగమమునందు, సర్వలోకములకు భయమును కలిగించు ఆ బాలుడు బిగ్గరగా నేడ్చెను (5). ఆ బాలుని రోదనధ్వనిచే భూమి అనేక పర్యాయములు కంపించెను. ఆ శబ్దముచే స్వర్గసత్యలోకములలోని జనులు చెవిటివారుగా అయిరి (6). ఆ బాలుని రోదనము వలన లోకములన్నియు భయపడినవి. లోకపాలకుల మనస్సులు భయముతో నిండిపోయినవి (7). ఓ బ్రాహ్మణశ్రేష్ఠా! ఇన్ని మాటలేల? వత్సా! సర్వమును వ్యాపించిన ఆ శిశువు యొక్క రోదనధ్వనిచే స్థావరజంగమాత్మకమగు జగత్తు అంతయూ కంపించెను (8).

అథ తే వ్యాకులాస్సర్వే దేవాస్సమునయో ద్రుతమ్ | పితామహం లోకగురం బ్రహ్మాణం శరణం యయుః || 9

తత్ర గత్వా చ తే దేవా మునయశ్చ సవాసవాః | ప్రణమ్య చ సుసంస్తుత్య ప్రోచుస్తం పరమేష్ఠినమ్ || 10

అపుడు ఆ దేవతలు, మునులు అందరు కంగారుపడి వెంటనే లోకములకు పెద్ద, పితామహుడునగు బ్రహ్మను శరణుజొచ్చిరి (9). ఆ దేవతలు మరియు మునులు ఇంద్రునితో గూడి అచటకు వెళ్లి ఆ పరమేష్ఠికి పరణమిల్లి చక్కగా స్తుతించి ఇట్లు పలికిరి (10).

దేవా ఊచుః |

లోకధీశ సురాధీశ భయం నస్సముపస్థితమ్ | తన్నాశయ మహాయోగిన్ జాతో%యం హ్యద్భుతో రవః || 11

దేవతలిట్లు పలికిరి -

లోకనాధా ! దేవాధీశా! మాకు భయము వచ్చి పడినది. ఈ అద్భుతమగు శబ్దము పుట్టుచున్నది. ఓ మహాయోగి! దానిని నశింపజేయుము (11).

సనత్కుమార ఉవాచ |

ఇత్యాకర్ణ్య వచస్తేషాం బ్రహ్మా లోకపితామహః | గంతుమైచ్ఛత్తతస్తత్ర కిమేతదితి విస్మితః || 12

తతో బ్రహ్మా సురైస్సాతావతరత్సత్యలోకతః | రవం తత్ జ్ఞాతుమిచ్ఛన్ స సముద్రమగమత్తదా || 13

యావత్తత్రాగతో బ్రహ్మా సర్వలోకపితామహః | తావత్సముద్రస్యోత్సంగే తం బాలం స దదర్శ హ || 14

ఆగతం విధిమాలోక్య దేవరూప్యథ సాగరః | ప్రణమ్య శిరసా బాలం తస్యోత్సంగే న్యవేశయత్ || 15

తతో బ్రహ్మాబ్రవీద్వాక్యం సాగరం విస్మయాన్వితః | జలరాశే ద్రుతం బ్రూహి కస్యాయం శిశురద్భుతః || 16

సనత్కుమారుడిట్లు పలికెను -

సనత్కుమారుడిట్లు పలికెను -

లోకములకు పితామహుడగు బ్రహ్మ వారి ఈ మాటను విని 'ఇది ఏమి?' అని విస్మయమును పొంది అచటకు వెళ్లవలెనని తలంచెను (12). వత్సా! అపుడు బ్రహ్మ ఆ శబ్దమును గురించి తెలియ గోరి దేవతలతో సహా నిత్యలోకమునుండి భూమి పైకి దిగి సముద్రమువద్దకు వెళ్లెను (13). సర్వలోకములకు పితామహుడగు ఆ బ్రహ్మ అచటకు వచ్చుట తోడనే సముద్రుని ఒడిలో ఆ

బాలకుని చూచెను (14). దేవతారూపమును ధరించియున్న సముద్రుడు అచటకు విచ్చేసిన బ్రహ్మను గాంచి శిరస్సుతో ప్రణమిల్లి ఆ బాలకుని ఆయన ఒడిలో కూర్చుండ బెట్టెను (15). అపుడు ఆశ్చర్యమును పొందియున్న బ్రహ్మ సముద్రునితో నిట్లనెను. ఓయీ సముద్రా! వెంటనే చెప్పుము. ఈ ఆద్భుత బాలకుడు ఎవని కుమారుడు? (16)

సనత్కుమార ఉవాచ |

బ్రహ్మణో వాక్య మాకర్ణ్య ముదితస్సాగరస్తదా | ప్రత్యువాచ ప్రజేశం స నత్వా స్తుత్వా కృతాంజలిః || 17

సనత్కుమారుడిట్లు పలికెను -

అపుడు సముద్రుడు బ్రహ్మయొక్క మాటను విని సంతసిల్లి, చేతులు జోడించి నమస్కరించి కొనియాడి ఆ ప్రజానాథునితో నిట్లనెను (17).

సముద్ర ఉవాచ |

భోభో బ్రహ్మన్ మయా ప్రాప్తో బాలకో%యమజానతా | ప్రభవం సింధు గంగాయామకస్మత్సర్వలోకప || 18

జాతకర్మాది సంస్కారాన్ కురుష్వాస్య జగద్గురో | జాతకోక్త ఫలం సర్వం విధాతర్వక్తు మర్హసి || 19

సముద్రుడిట్లు పలికెను -

ఓ బ్రహ్మ! నాకు తెలియకుండగనే నాకు ఈ బాలుడు దొరికినాడు. సర్వ లోకములను పాలించువాడా! ఈతడు అకస్మాత్తుగా గంగాసాగరసంగమమునుండి పుట్టినాడు (18). ఓ జగద్గురూ! ఈతనికి జాతకర్మ మొదలగు సంస్కారములను చేయించుము. ఓ విధాతా! వీని జాతకములో కనబడే భవిష్యత్ఫలము నంతనూ వివరించ తగుదువు (19).

సనత్కుమార ఉవాచ |

ఏవం వదతి పాథోధౌ స బాల స్సాగరాత్మజః | బ్రహ్మాణ మగ్రహీత్కంఠే విధున్వంతం ముహుర్ముహుః || 20

విధూననం చ తస్మై#్యవం సర్వలోక కృతో విధేః | పీడితస్య చ కాలేయ నేత్రాభ్యామగమజ్జలమ్ || 21

కరాభ్యామబ్ధి జాతస్య తత్సుతస్య మహౌజసః | కథం చిన్ముక్త కంటస్తు బ్రహ్మా ప్రోవాచ సాదరమ్ || 22

సనత్కుమారుడిట్లు పలికెను -

సముద్రుడిట్లు పలుకుచుండగా తలను పలుమారు ఊపుచున్న బ్రహ్మను సముద్రపుత్రుడగు ఆ బాలకుడు కంఠమునందు పట్టుకొనెను (20). ఓ వ్యాసా! సర్వలోకములను సృష్టించిన విధి తలను ఊపుచుండగా ఆ బాలుడు కంఠమును బిగిచుటచే వ్యథను పొందెను. ఆయన నేత్రములనుండి నీరు ఉబికెను (21). చేతులతో కంఠమును పట్టుకొని యున్న మహాతేజశ్శాలియగు ఆ సముద్ర పుత్రుని పట్టునుండి బ్రహ్మ అతికష్టముపై విడిపించుకొని ఆదరముతో నిట్లు పలికెను (22).

బ్రహ్మోవాచ |

శృణు సాగర వక్ష్యామి తవాస్య తనయస్య హి | జాతకోక్త ఫలం సర్వం సమాధానరతః ఖలు || 23

నేత్రాభ్యాం విధృతం యస్మాదనేనైవ జలం మమ | తస్మాజ్జలందరేతీహ ఖ్యాతో నామ్నా భవత్వసౌ || 24

అధునైవైష తరుణస్సశాస్త్రార్థ పారగః | మహాపరాక్రమో ధీరో యోద్ధా చ రణదుర్మదః || 25

భవిష్యతి చ గంభీరస్త్వం యథా సమరే గుహః | సర్వతేజా చ సంగ్రామే సర్వసంపద్విరాజితః || 26

దైత్యానామధిపో బాలసర్వేషాం చ భవిష్యతి | విష్ణోరపి భ##వేజ్జేతా మ కుతశ్చిత్పరాభవః || 27

అవధ్య స్సర్వభూతానాం వినా రుద్రం భవిష్యతి | యత ఏష సముద్భూత స్తత్రేదానీం గమిష్యతి || 28

పతివ్రతాస్య భవితా పత్నీ సౌభాగ్యవర్ధినీ | సర్వాంగ సుందరీ రమ్యా ప్రియావాక్ఛీలసాగరా || 29

బ్రహ్మ ఇట్లు పసలికెను -

ఓ సముద్రా! నీ ఈ కుమారుని ఆతకఫలమునంతనూ చెప్పెదను. మనస్సును ఏకాగ్రము చేసి నా మాటను శ్రద్ధగా వినుము (23). ఈతడు నా కన్నులనుండి జలమును రప్పించినాడు గాన ఈతనికి జలంధరుడను పేరు ప్రఖ్యాతమగుగాక! (24) ఈతడు యువకుడై ఆ వయస్సులోనే శాస్త్రార్థములనన్నిటినీ తరచి చూడగలడు. మహారాక్రమ శాలియగు ఈ ధీరుడు యుద్ధములో గర్వించి శత్రువులను దునుమాడగలడు (25). ఈతడు నీవలె గంభీరుడు, కుమారస్వామివలె యుద్ధములో సర్వులను జయించువాడు, సర్వ సంపదలతో విరాజిల్లువాడు కాగలడు (26). ఈ బాలుడు రాక్షసులందరికి అధినాయకుడు కాలగలడు. విష్ణువును కూడ జయించగలడు. ఈతనికి ఎచట నైననూ పరాభవము కలుగబోదు (27). రుద్రుడు తప్ప ఈతనిని సర్వప్రాణులలో ఎవ్వరైననూ సంహరించజాలరు. ఈతడు ఏ రుద్రుని వలన పుట్టినాడో, ఆతని వలననే పరాజయమును పొందును (28). ఈతని భార్యపతివ్రత, సౌభాగ్యమును వర్ధిల్లజేయునది, సర్వాంగసుందరి, రమ్య, ప్రియమును పలుకునది, మరియు సచ్ఛీలమునకు పెన్నిధి కాలగలదు (29).

సనత్కుమార ఉవాచ |

ఇత్యుక్త్వా శుక్రమాహూయ రాజ్యే తం చాభ్యషేచయత్ | ఆమంత్ర్య సరితాం నాథం బ్రహ్మాంతర్ధానమన్వగాత్ || 30

అథ తద్దర్శనోత్ఫుల్ల నయనస్సాగర స్తదా | తమాత్మజం సమాదాయ స్వగేహ మగమన్ముదా || 31

అపోషయన్మహోపాయై స్స్వబాలం ముదితాత్మకః | సర్వాంగ సుందరం రమ్యం మహాద్భుతం సుతేజసమ్ || 32

అథాంబుధిస్సమాహూయ కాలనేమిం మహాసురమ్ | వృందాభిధాం సుతాం తస్య తద్భార్యార్థ మయాచత || 33

కాలనేమ్యసురో వీరో %సురాణాం ప్రవరస్సుధీః | సాధు మేనే%ంబుధేర్యాచ్ఞాం స్వకర్మ నిపుణో మునే || 34

జలంధరాయ వీరాయసాగర ప్రభవాయ చ | దదౌ బ్రహ్మవిధానేన స్వసుతాం ప్రాణవల్లభామ్ || 35

తదోత్సవో మహానాసీద్వివామే చ తయోస్తదా | సుఖం ప్రాపుర్నదా నద్యో%సురాశ్చైవాఖిలా మునే || 36

సనత్కుమారుడిట్లు పలికెను -

బ్రహ్మ ఇట్లు పలికి శుక్రుని ఆహ్వానించి ఆ బాలకుని రాజ్యాభిషిక్తుని చేసెను. ఆయన సముద్రుని వద్ద సెలవు తీసుకొని అంతర్ధానమును జెందెను (30). అపుడు ఆ బాలకుని చూచి వికసించే నయనములు గల ఆ సముద్రుడు ఆ కుమరుని తీసుకొని ఆనందముతో స్వగృహమునకు వెళ్లెను (31). ఆనందముతో నిండిన మనస్సు గల సముద్రుడు సర్వావయవముల యందు అందగాడు, ఉల్లాసమును కలిగించువాడు, మహాద్భుతమగు తేజస్సు గలవాడు అగు తన బాలకుని అనేకములగు చక్కని ఉపాయములతో పెంచి పోషించెను (32). అపుడు సముద్రుడు కాలనేమియను గొప్ప రాక్షసుని పిలిచి అతని కుమార్తెయగు వృందను జలంధరునకిచ్చి వివాహమును చేయుమని గోరెను (33). రాక్షసశ్రేష్ఠుడు, వీరుడు, బుద్ధి మంతుడు, తన పనిలో నిపుణుడు అగు కాలనేమి సముద్రుని కోరిక యోగ్యముగా నున్నదని తలంచెను. ఓ మహర్షీ (34) సముద్రపుత్రుడు, వీరుడునగు జలంధరునకు ఆతడు ప్రాణప్రియురాలగు తన కుమార్తెనిచ్చి వేదోక్తవిధానముతో వివాహమును చేసెను (35). వారిద్దరి

వివాహములో అపుడు గొప్ప ఉత్సవము జరిగెను. ఓ మహర్షీ ! నదులు, నదములు, సమస్తరాక్షసులు ఆనందమును పొందిరి (36).

సముద్రో%తి సుఖం ప్రాప సుతం దృష్ట్వా హి సస్త్రియమ్ | దానం దదౌ ద్విజాతిభ్యో%ప్యన్యేభ్యశ్చ యథావిధి || 37

యే దేవైర్నిర్జితాః పూర్వం దైత్యాః పాతాలసంస్థితాః | తే హి భూమండలం యాతా నిర్భయాస్తముపాశ్రితాః || 38

తే కాలనేమి ప్రముఖాస్తతో%సురాః తస్మై#ె సుతాం సింధు సుతాయ దత్త్వా |

బభూవురత్యంతముదాన్వితా హి తమాశ్రితా దేవ వినిర్జయాయ || 39

సచాపి వీరో%ంబుధి బాలకో%సౌ జలంధరాఖ్యో%సుర వీరవీరః |

సంప్రాప్య భార్యమతి సుందరీం వశీ చకార రాజ్యం హి కవిప్రభావాత్ || 40

ఇతి శ్రీశివమహాపురాణ రుద్రసంహితాయాం యుద్ధఖండే జలంధరోత్పత్తి వివాహ వర్ణనం నామ చతుర్దశో%ధ్యాయః. (14)

భార్యతో గూడియున్న కుమారుని చూచి సముద్రుడు మిక్కలి ఆనందించి, బ్రాహ్మణులకు, మరియు ఇతరులకు యథావిథిగా దానమునిచ్చెను (37). పూర్వము దేవతలచే పరిజితులై పాతాళమునందు తలదాచుకొనిన రాక్షసులు నిర్భయముగా భూమండలమునకు వచ్చి ఆతనిని ఆశ్రయించిరి (38). సముద్రపుత్రుడగు ఆతనికి తన కుమార్తెను కన్యాదానము చేసిన కాలనేమి, మరియు ప్రముఖులగు ఇతరరాక్షసులు మిక్కిలి ఆనందమును పొందినవారై, దేవతలను నిర్జించుట కొరకు ఆతని కొలువులో చేరిరి (39). వీరుడు, సముద్రపుత్రుడు, రాక్షసవీరులలో

శ్రేష్ఠుడు అగు ఈ జలంధరుడు మిక్కిలి సుందరియగు భార్యను పొంది, శుక్రుని ప్రభావముచే ఇంద్రియ జయముగలవాడై రాజ్యము నేలెను (40).

శ్రీ శివమహాపురాణములో రుద్రసంహితయందు యుద్ధ ఖండలో జలంధరుని పుట్టుక, వివాహము అనే పదునాల్గవ అధ్యాయము ముగిసినది (14).